# తెలుగు భారతి

## రెండవ తరగతి వాచకం

సంశోధకులు :
శ్రీమతి డాక్టర్ బి. సరోజన
శ్రీమతి వి. రత్నమాల

ప్రధాన సంపాదకమండలి :
అధ్యక్షులు : ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు
ఆచార్యకేతు విశ్వనాథరెడ్డి
డా॥ వి. వి. యల్. నరసింహారావు
డా॥ అంతటి నరసింహం

చిత్రకారుడు :
శ్రీ. గోలి శివరామయ్య






ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ
హైదరాబాదు

ABP 2008-09

1. Name of the Book : 2nd Class – Telugu Reader

2. Copyright Holder : Director of School Education Government of Andhra Pradesh, Saifabad, Hyderabad.

3. Year of Publication : 2008

4. Published by : Arkbird Publications # 5-9-802, Rosary Convent Lane, Gunfoundry, Hyderabad-500001 On behalf of A.P Govt. Text Book Press, Hyderabad.

5. Printed at : New Printindia (P) Ltd. 8/4B, Site – IV, Industrial Area, Sahibabad, GZB, (U.P.)

6. Paper used for printing : 60 GSM white paper

Price Rs. 12.50



## ముందుమాట

ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం ప్రాథమిక విద్యాబోధనను పటిష్టపరచడానికి, బోధనాభ్యసనంలో గుణాత్మకతను పెంపొందించడానికి, విద్యార్థి కేంద్రీకృతంగా కృత్యాధార బోధనకు అనువైన అంశాలను ఎంపిక చేసికొనడం లక్ష్యంగా అభిరుచికరమైన, ఆకర్షణీయమైన, పరిసరాలకనుగుణ్యమైన, స్థానికవనరుల ప్రాధాన్యంగా, ఆనందదాయకమైన అభ్యసనకు ఒకటవ తరగతి వాచకం వలెనే రెండవ తరగతి వాచకాన్ని గూడా తయారు చేయడానికి నిర్ణయం తీసుకొంది. ఫలితంగా ఈ వాచకం తయారు చేయబడింది.

1986 జాతీయ విద్యావిధానాన్ని అనుసరించి తెలుగువాచకాలను సిద్ధం చేయడానికి అనుగుణంగా, పాఠ్యప్రణాళికను రూపొందించడానికి ఆచార్య శ్రీ కె.కె. రంగానాథాచార్యుల అధ్యక్షతన ఒక సంఘం నియమించబడింది. ఆ సంఘం రూపొందించిన పాఠ్యప్రణాళిక ప్రకారం ఈ వాచకం తయారు చేయబడింది. విద్యార్థులు నిర్దిష్ట కనీసాభ్యసన స్థాయిలను సాధించుటకనువైన వ్యూహంతో వాచకం రూపొందించబడింది.

మాతృభాషా బోధనా లక్ష్యాలకనుగుణంగా విద్యార్థుల సమగ్ర వికాసానికి తోడ్పడేటట్లుగా, స్వతంత్రంగా చదివి అర్థం చేసికోడానికి వీలుకలిగేదిగా, విద్యార్థుల మనసులోని భావాలను సొంతంగా చెప్పగలిగే రీతిగా, విద్యార్థులలో క్రమబద్ధమైన ఆలోచనలను పెంపొందింపజేసేదిగా, విషయగ్రహణ శక్తిని అభివృద్ధి చేసేదిగా, సృజనాత్మకతను వృద్ధిపరచేదిగా, ఈ వాచకాన్ని తయారు చేయడమైనది.

.విద్యాసముపార్జనలో జాతీయ, సామాజిక, మానవతా విలువలు మొదలయిన వాటికి ప్రాధాన్యతనిచ్చి విద్యార్థులలో దేశభక్తి, భూతదయ, సత్కార్యాచరణ, ధైర్యసాహసాలు, సృజనాత్మకత, పఠనాసక్తులను కలిగించుటకు దోహదకారిగా ఉండేటట్లు వాచకం తయారు చేయబడింది.

భాషానైపుణ్యాలయిన శ్రవణ, భాషణ, పఠన, లేఖనాలపై విద్యార్థులు సునాయాసంగా అభ్యసన ప్రక్రియ కొనసాగించడానికి ఈ వాచకం సహాయకారి కాగలదనుటలో సందేహములేదు.

ఒకటవ తరగతి వాచకములో పాటించిన పద్ధతులనే రెండవతరగతి వాచకం తయారీలోను, పాఠ్యక్రమరూప కల్పనలోను స్థూలంగా పాటించడమైనది.

శ్రావ్యమైన దేశభక్తిగీతాలు, రాష్ట్ర, దేశ ఔన్నత్యాన్ని చాటే పాటలు, విద్యార్థులు - నిత్యం పాడి ఆనందించదగిన విధంగా వాచకం మొదటి పేజీలలో పొందుపరచడం జరిగింది. ఉపాధ్యాయులు వీటిని శ్రావ్యంగా పాడి, పాడించి రసానుభూతితో పాటు దేశాభిమానాన్ని విద్యార్థులలో పెంపొందించవచ్చు.

అందరూ ఎల్లప్పుడు జ్ఞప్తికి తెచ్చుకొనడమే కాక నిత్య జీవితంలో ఆచరించదగు 'ప్రతిజ్ఞ' ను కూడా పాఠ్యక్రమం కంటె ముందు పేజీలలోనే ఇవ్వడమైనది.

- విషయసూచికలో విషయాన్ని ఏఏ పుటలలో పొందు పరచిందీ వివరించబడింది.
- ఒకటవ తరగతి నుండి క్రమంగా రెండవ తరగతిలోనికి ప్రవేశించుటకు అనువుగా తరగతి-1 వాచకంలో వర్ణమాల చివరిపేజీలో ఉండగా, ఈ వాచకంలో ముందుగానే ఇవ్వబడింది.

- విద్యార్థుల వయస్సు, అభిరుచులు, ఆసక్తులు, అనుభూతుల ఆధారంగా ప్రతి పేజీలో ఆకర్షణీయమైన, రంగురంగుల బొమ్మలు పొందుపరచడమైనది.
- కింది తరగతిలో నేర్చుకొన్న ద్విత్వ, సంయుక్తాక్షరాలను పునశ్చరణ చేస్తూ మిగిలిన ద్విత్వ సంయుక్తాక్షరాలను పాఠ్యక్రమంలో చేర్చడం జరిగింది.
- వాచకంలో విద్యార్థులకు ఉత్సాహాన్ని కలిగించి, నైతిక విలువల్ని పెంపొందించే చిన్న కథలు, నీతి వాక్యాలు, సాహస కృత్యాలు మొదలయినవి చేర్చబడినాయి.
- ప్రతిపాఠం చివర అభ్యాసం కోసం కొన్ని అభ్యసన కృత్యాలు ఇవ్వబడ్డాయి.
- బోధనయందాసక్తి, బాలల ప్రగతియందనురక్తి, ప్రతి విద్యార్థిపట్ల సానుభూతి గల ఉపాధ్యాయులు వారి బోధనాభ్యసన ప్రక్రియలను నిత్యనూతనంగా మలచుకొనేటట్లు, విద్యార్థులు ఉత్తేజితులై, సంతోషంగా వాటిని నేర్చుకొనేటట్లుగా చేయడంలో ఈ వాచకం ఎంతగానోతోడ్పడుతుంది. భాషానైపుణ్యాలను పెంపొందించి కనిస అభ్యసన స్థాయిలను సాధించడంలో కూడా సహాయపడుతుందని ఆశిస్తున్నాం.

ఈ వాచక రచనలో ఈ కింది అనుభవజ్ఞులు, విషయ నిపుణులు పాల్గొన్నారు.

| | | |
|---|---|---|
| శ్రీ పి. దక్షిణామూర్తి | - | సలహాదారుడు,<br>రిటైర్డ్ రీసర్చ్ ఆఫీసర్,<br>తెలుగు అకాడమి, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు. |
| శ్రీమతి బి.యం. కుసుమ కుమారి | - | ప్రశిక్షకులు.<br>అచార్యులు, మూల్యాంకన విభాగం,<br>రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణా సంస్థ,<br>హైదరాబాదు. |
| డాక్టర్ బి. సరోజన | - | ఉపన్యాసకులు,<br>ఉన్నత విద్యా అధ్యయన సంస్థ, హైదరాబాదు. |
| శ్రీ జి. వెంకటస్వామి | - | ఉపన్యాసకులు, అనియతవిద్యా విభాగం,<br>రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణా సంస్థ,<br>హైదరాబాదు. |
| శ్రీమతి బి. శశి | - | ఉపన్యాసకులు, మూల్యాంకన విభాగం,<br>రాష్ట్ర విద్యాపరిశోధన శిక్షణా సంస్థ,<br>హైదరాబాదు. |
| శ్రీమతి వి. రత్నమాల | - | ఉపన్యాసకులు,<br>ఆంధ్ర మహిళాసభ విద్యాకళాశాల,<br>హైదరాబాదు. |

రచయితలు:

| | | |
|---|---|---|
| శ్రీ యస్. గోపాలకృష్ణమూర్తి | - | సీనియర్ లెక్చరర్,<br>జిల్లా విద్యా శిక్షణా సంస్థ, భీముని పట్నం,<br>విశాఖపట్నం జిల్లా. |
| శ్రీ బి. నీలకంఠరావు, | - | సీనియర్ లెక్చరర్,<br>జిల్లా విద్యా శిక్షణా సంస్థ, సబ్ క్యాంపస్,<br>ఉట్నూరు, ఆదిలాబాదు జిల్లా. |
| యస్. బి. జె. ఆర్. చౌదరి | - | ఉపన్యాసకులు,<br>జిల్లా విద్యాశిక్షణా సంస్థ,<br>గుంటూరు. |
| శ్రీ కె. మహాదేవరెడ్డి | - | సీనియర్ ఉపన్యాసకులు,<br>జిల్లా విద్యాశిక్షణా సంస్థ,<br>నిజామాబాద్. |
| శ్రీ ఎ. బాలసుబ్రమణ్యం | - | ఉపాధ్యాయుడు,<br>మండల పరిషత్ ప్రాథమికోన్నత పాఠశాల<br>రామాపురం, చిత్తూరు జిల్లా. |
| శ్రీమతి కె. లక్ష్మీబాయి | - | ఉపాధ్యాయిని,<br>శ్రీ అరబిందో ప్రాథమికోన్నత పాఠశాల,<br>లాల్ దర్వాజా, హైదరాబాదు. |
| శ్రీమతి బి. సుజాతా శేఖర్ | - | ఉపాధ్యాయిని,<br>జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాల,<br>పడమటపల్లె, దేవరకొండ, నల్గొండ జిల్లా. |
| శ్రీమతి ఎ. సత్యగీత, | - | ప్రధానోపాధ్యాయిని,<br>మండల పరిషత్ ప్రాథమిక పాఠశాల,<br>నర్సింగవానిపాలెం, వడ్లపూడి, విశాఖపట్నం జిల్లా. |
| శ్రీ ముదిగొండ శాస్త్రి | - | ఉపాధ్యాయుడు,<br>యస్. యఫ్. ప్రాథమికోన్నత పాఠశాల,<br>ఎలకుర్రు, కృష్ణా జిల్లా. |
| శ్రీ శివరాముడు | - | ప్రధానోపాధ్యాయుడు,<br>మండల పరిషత్ ప్రాథమిక పాఠశాల,<br>నెహ్రూనగర్, పగిడ్యాల మండలం,<br>కర్నూలు జిల్లా. |

*ఈ వాచకంపై తమ అభిప్రాయాలను, సలహాలను, సూచనలను పాఠశాల విద్యాశాఖ కమీషనర్ మరియు డైరెక్టర్ గారికి తెలువగలరని కోరుచున్నాము.*

## ఆంధ్రప్రదేశ్ ప్రాథమిక విద్యాపథకం - అభ్యసన సూత్రాలు

అ. ఉపాధ్యాయులు రూపొందించిన అభ్యసన ప్రక్రియలను కల్పించటం.

ఆ. క్రియలు, అన్వేషణ, ప్రయోగాల ద్వారా అభ్యసనాన్ని అభివృద్ధిపరచటం.

ఇ. వ్యక్తిగత, జట్టు, పూర్తి తరగతి పనిని అభివృద్ధిపరచటం.

ఈ. వైయక్తిక భేదాలకు తగిన అభ్యసనాన్ని కల్పించటం.

ఉ. స్థానిక పరిసరాలను వినియోగించటం.

ఊ. విద్యార్థుల పనిని ప్రదర్శించి, చక్కగా నిర్వహించటం ద్వారా ఆసక్తికరమగు తరగతిగదిని రూపొందించటం.

# వందేమాతరం

- బంకించంద్ర ఛటర్జీ

వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం; వందేమాతరం
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం వందేమాతరం

భావం : భారత మాతకు వందనం. తియ్యని నీటితో, కమ్మని పండ్లతో, చల్లని గాలులతో, పచ్చని పైరుతో విలసిల్లే భారత మాతకు వందనం. రాత్రులు తెల్లని వెన్నెలతో పులకిస్తూ విరబూసిన చెట్లతో శోభిస్తూ స్వచ్ఛమైన నవ్వులతో మధురమైన మాటలతో మాకు సుఖాలు కలిగిస్తూ వరాలనిచ్చే భారతమాతకు వందనం.

ఉపాధ్యాయులకు సూచన:

స్వాతంత్ర్య సమరంలో వందేమాతరం గీతం యావద్భారత దేశాన్నీ ఉర్రూతలూగించింది. దీన్ని స్వాతంత్ర్య విప్లవగీతంగా భారతీయులందరూ గానం చేశారు. ఇది బ్రిటీష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా సింహగర్జనలా మారుమోగింది. దేశభక్తికీ, స్వాతంత్ర్య పిపాసకూ ఈ గీతం ప్రతీకగా నిలచింది. ఈ గీతం బంకించంద్ర ఛటర్జీ రాసిన "ఆనంద్ మఠ్" నవలలోనిది. ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి. భావం చెప్పించాలి.



# మా తెలుగు తల్లి

- శంకరంబాడి సుందరాచారి



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్న తల్లికి మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి
గలగలా గోదారి కదలి పోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ ఆటలే ఆడుతాం - నీ పాటలే పాడుతాం
జై తెలుగు తల్లీ ! జై తెలుగు తల్లీ !

# సారే జహాఁ సె అచ్ఛా

- మహ్మద్ ఇఖ్బాల్

సారే జహాఁసె అచ్ఛా హిందూస్తాఁ హమారా
హమ్ బుల్ బులేఁహై ఇస్‌కే యే గుల్ సిత్మాఁ హమార హమారా ॥

పరబత్ వో సబ్ సే ఊంఛా హమ్‌సాయా ఆస్మాఁ కా
వో సంతరీ హమారా ! వో పాస్‌బాఁ హమార హమారా ॥

గోదీమె ఖేల్‌తీహైఁ ఇస్‌కీ హజారోఁ నదియాఁ
గుల్‌షన్‌హై జిన్ కే దమ్‌సే రష్ కే జినాఁ హమార హమారా ॥

మజ్-హబ్ నహీఁ సిఖాతా ఆపస్‌మె బైర్ రఖ్‌నా
హిందీ హైఁ హమ్ హిందీ హైఁ హమ్
హిందీ హైఁ హమ్ వతన్ హైఁ హిందుస్తాఁ హమార హమారా ॥

భావం : ప్రపంచంలో కెల్లా మన భారతదేశం ఉత్తమమైంది. ఇది మనకో ఉద్యానవనం. మనమిక్కడ బుల్ బుల్ పిట్టలం. ఆకాశాన్నంటే ఆ మహోన్నత పర్వతం ఆ పక్కన మనకు కాపలాగా రక్షణగా నిలచి ఉంది. ఈ దేశమాత ఒడిలో వేలాది నదులు ఆడుకుంటున్నాయి. ఈ నదీ జలాలతో వికసించిన పూదోటను చూసి స్వర్గమే అసూయ పడుతున్నది. మతం, పరస్పర వైరాన్ని బోధించదు. మనమంతా భారతీయులం! మనదేశం భారతదేశం.

ఉపాధ్యాయులకు సూచన :

ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి.



# జాతీయ గీతం

- రవీంద్రనాథ్ టాగూరు

జనగణమన అధినాయక జయహే !
భారత భాగ్య విధాతా !
పంజాబ, సింధు, గుజరాత, మరాఠా,
ద్రావిడ, ఉత్కళ, వంగ !
వింధ్య, హిమాచల, యమునా, గంగ,
ఉచ్ఛల జలధితరంగ !
తవ శుభనామే జాగే !
తవ శుభ ఆశిష మాగే !
గాహే తవ జయ గాథా !
జనగణ మంగళదాయక జయహే
భారత భాగ్యవిధాతా !
జయహే ! జయహే ! జయహే !
జయ జయ జయ జయహే !

భావం : జనులందరి మనస్సులకూ అధినేతవు, భారత భాగ్య విధాతవు అయిన నీకు జయమగుగాక. పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్ర, ద్రావిడం, ఉత్కళ, వంగ దేశాలతోను, వింధ్య హిమాలయ పర్వతాలతోను, యమునా గంగా ప్రవాహాలతోను ఉవ్వెత్తుగా లేచే సముద్ర తరంగాలతోను శోభించే ఓ భారత భాగ్య విధాతా ! వాటికి నీ శుభనామం ఉద్బోధ కలిగిస్తుంది. అవి నీ ఆశీస్సులు అర్థిస్తాయి. నీ జయగాథల్ని గానం చేస్తాయి. సమస్త జనులకూ మంగళ ప్రదాతవు భారత భాగ్య విధాతవు, అయిన నీకు జయమగుగాక! జయమగుగాక! జయమగుగాక !

ఒక వివరణ ఈ గీతం అవిభక్త భారతదేశంలోని రాష్ట్రాలను సూచిస్తుంది. సింధుప్రాంతం ఇప్పుడు పాకిస్తాన్‌లో ఉంది. మరాఠా అంటే మహారాష్ట్రం. ద్రావిడ అంటే తెలుగు, తమిళ, కర్ణాటక, కేరళ ప్రాంతాలు. ఉత్కళ అంటే ఒరిస్సా. వంగ అంటే ఇప్పటి పశ్చిమ బెంగాలు.

## ప్రతిజ్ఞ

భారతదేశం నా మాతృభూమి. భారతీయులందరూ నా సహోదరులు. నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వసంపద నాకు గర్వకారణం. దీనికి అర్హత పొందడానికి సర్వదా నేను కృషి చేస్తాను.

నా తల్లిదండ్రుల్ని, ఉపాధ్యాయుల్ని, పెద్దలందర్ని గౌరవిస్తాను. ప్రతివారితోను మర్యాదగా నడచుకొంటాను.

నా దేశంపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందానికి మూలం.



## విషయసూచిక



## వందనం

వందనం, వందనం
తెలుగు తల్లికి వందనం
నందనం, నందనం
తెలుగు భూమి నందనం
సుందరం, సుందరం
తెలుగు గడ్డ సుందరం
చందనం, చందనం
తెలుగు నేల చందనం
సుమధురం, సుమధురం
తెలుగు భాష సుమధురం

అందరం, అందరం
తెలుగు బిడ్డలమందరం
ఉండెదం, ఉండెదం
కలసి మెలసి ఉండెదం
పెంచెదం, పెంచెదం
తెలుగు కీర్తి పెంచెదం
పంచెదం, పంచెదం
తెలుగు వెలుగు పంచెదం
వందనం, వందనం
తెలుగు తల్లికి వందనం

## 1 వర్ణమాల

ఈ కింది అక్షరాలను గుర్తుపట్టి చదవాలి.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ

ఎ ఏ ఐ ఒ ఓ ఔ

అం అః

| | | | | |
|---|---|---|---|---|
| క | ఖ | గ | ఘ | ఙ |
| చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ |
| త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ |
| య | ర | ల | ళ | వ |
| శ | ష | స | హ | |

గడులలోని అక్షరాలను ఒకటవ తరగతిలో పరిచయం చేయలేదు.
ఈ తరగతిలో పరిచయంచేస్తున్నాం.



## 2 గుణింతాలు (పునశ్చరణ)

ఈ మాటలు పలకాలి, చదవాలి.

| | |
|---|---|
| జేజేలు | పూలు |
| దేవత | తామర |
| కొడుకు | కైక |
| కృషి | బీరతీగ |
| మొదలు | మోకాలు |
| చెరువు | గౌరి |

పాపజడ భీమనడక చౌకబేరం మృదంగనాదం

కింది అక్షరాలను చదవాలి.

| | | | | |
|---|---|---|---|---|
| కౌ | లే | తే | తి | రి |
| యూ | మి | కొ | మొ | యో |
| మో | ర | ఠ | హే | వే |
| బ | భ | బే | చే | జ |

కింది ఖాళీలను నింపాలి.

జే.........లు గౌ......... బీర.......గ చె.........వు

# 3 మహాప్రాణ అక్షరాలు (పునశ్చరణ)

కింది మాటలు పలకాలి, చదవాలి.

| | |
|---|---|
| ఝుంకారం | పతనం |
| ఢంకా | ఫలం |
| శంఖం | రథం |
| పింఛం | బాధ |
| ఖగం | మేఘం |
| భోజనం | దేవునిరథం |
| ఫణిధరుడు | కారుమేఘం |
| శివధనుస్సు | వేదపఠనం |

కింది బొమ్మలను చూసి పేర్లు రాయాలి.


.......................


.......................


.......................

కింది ఖాళీలను నింపాలి.

.......ణిధరుడు  శివ.........నుస్సు  కారుమే.........ం





| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఖ | ఘ | ఛ | ఝ | ఠ | ఢ | థ | ఫ | భ |
| ఖా | ఘా | ఛా | ఝా | ఠా | ఢా | థా | ఫా | భా |
| ఖి | ఘి | ఛి | ఝి | ఠి | ఢి | థి | ఫి | భి |
| ఖీ | ఘీ | ఛీ | ఝీ | ఠీ | ఢీ | థీ | ఫీ | భీ |
| ఖు | ఘు | ఛు | ఝు | ఠు | ఢు | థు | ఫు | భు |
| ఖూ | ఘూ | ఛూ | ఝూ | ఠూ | ఢూ | థూ | ఫూ | భూ |
| ఖె | ఘె | ఛె | ఝె | ఠె | ఢె | థె | ఫె | భె |
| ఖే | ఘే | ఛే | ఝే | ఠే | ఢే | థే | ఫే | భే |
| ఖై | ఘై | ఛై | ఝై | ఠై | ఢై | థై | ఫై | భై |
| ఖొ | ఘొ | ఛొ | ఝొ | ఠొ | ఢొ | థొ | ఫొ | భొ |
| ఖో | ఘో | ఛో | ఝో | ఠో | ఢో | థో | ఫో | భో |
| ఖౌ | ఘౌ | ఛౌ | ఝౌ | ఠౌ | ఢౌ | థౌ | ఫౌ | భౌ |
| ఖం | ఘం | ఛం | ఝం | ఠం | ఢం | థం | ఫం | భం |

కింది అక్షరాలను చూసి రాయాలి.

భై ☐ ధై ☐ ఘౌ ☐ భూ ☐ ఫో ☐ ఠీ ☐

కింది అక్షరానికి గుణింతం రాయాలి.

ధ..........................................................................

మహాప్రాణాక్షరాలకు ' ై 'ఐత్వం చేర్చిరాయాలి.

..........................................................................

సూచన:- పైన మహాప్రాణ అక్షరాలకు ఇచ్చిన గుణింతాలలో కొన్నిటిని మాత్రమే మాటల్లో వాడుతున్నాం. వాటికి మాత్రమే ప్రత్యేక అభ్యాసాలు ఇవ్వాలి. మిగిలినవి గుణింత రూపాలు తెలుసుకోవడానికి మాత్రమే.

# 4 మహాప్రాణ అక్షరాలు - గుణింతాలు



ఢామ్మని పేలుతుంది.



ఘీంకరిస్తుంది.



భౌ భౌ అంటుంది.

ఈ పదాలు చదవాలి, రాయాలి.

| | |
|---|---|
| తుఫాను | ధీరుడు |
| మిఠాయి | ఛురిక |
| భారతం | భుజం |
| అతిథి | ధూళి |
| భీముడు | భేదం |
| ఘీంకారం | మేఘం |
| దాశరథి | మిఠాయి ఉండ |
| భోజనశాల | పాదధూళి |
| భారతదేశం | పెనుతుఫాను |



ఈ పట్టికలోని మహాప్రాణఅక్షరాలను గుర్తుపట్టి చదవాలి.

| | | | | |
|---|---|---|---|---|
| కొ | బి | ఫే | త్రై | ధౌ |
| గా | పౌ | భా | ఝూ | భో |
| ఛ | క | లి | ఠి | భై |
| చి | ఘూ | డె | ధ | ఘ |

కింది పదాలను జతపరచాలి.

| | |
|---|---|
| భోజన | ఉండ |
| మిఠాయి | పింఛం |
| నెమలి | శాల |

బొమ్మను చూసి ఖాళీలు నింపాలి.



................. జనం



................. దీ



................. డేలు

బొమ్మకు సరైన మాట వాడి ఈ కింది వాటిని చదవాలి.

శంకరుడు  ఊదాడు.

నెమలి  అందంగా ఉంది.

ఝషం అంటే 

కమఠం అంటే 

 ఢమఢమ మోగింది.

ఈ కింది పదాలను చదవాలి, రాయాలి.

| | |
|---|---|
| రాజ సౌధం | ఏనుగు ఘీంకారం |
| ఘోర రణం | కంఠహారం |

కింది ఖాళీలను నింపాలి.

1. కం........... హారం
3. ఏనుగు...........ంకారం.
2. రాజ సౌ............ ం
4. ...........ర రణం.



# 5 ద్విత్వ అక్షరాలు 'క' ఒత్తు, 'త' ఒత్తు

(ఒక హల్లుతో అదే హల్లుచేరే పదాలు)





| క | ్క | త | ్త |
|---|---|---|---|

టక్కరి నక్క ఎక్కడ?
అదిగో అదిగో అక్కడ
పొదల చాటున దాక్కుంది
నక్కినక్కి చూసింది

అత్త ఉత్తరం చదివింది
పూల గుత్తులు కోసింది
అత్తరు సీసా తీసింది
కొత్త చీరకు పూసింది

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| కుక్క | అక్క | అత్తరు | కత్తి |
| రెక్క | లక్క | ఉత్తరం | సుత్తి |
| చక్కని | చిక్కని | గిత్త | ఎత్తు |
| చుక్కర | చుక్కలు | విత్తనం | కత్తెర |

అక్క ముక్కుకు చక్కని ముక్కర
చక్కెర కలిపిన చిక్కని పాలు

చెత్త కుండీలో చిత్తుకాగితం
తెల్లని పత్తిలో నల్లని విత్తనాలు

బొమ్మను చూసి ఖాళీలు నింపాలి.



కు .........

చు ......... లు

ము ......... ర





క ...........

సు ...........

క ...........ర.

కింది పదాలకు అవసరమైన చోట ఒత్తు చేర్చి చదవాలి.

| | |
|---|---|
| లక | అత |
| ముకు | పతి |
| రెక | వితనం |
| చెక ర | ఉతరం |

కింది మాటలను గబగబా చదవాలి.

నక్కినక్కి

చెక్కముక్క

కొత్తగిత్త

చక్కనిచుక్క

టక్కరినక్క

ముక్కుకు ముక్కర



## 6 ద్విత్వ అక్షరాలు - 'న' ఒత్తు, 'మ' ఒత్తు





న ్న

వెన్నతిన్న చిన్నవాడు
వెన్నెలలో ఆటలాడ
కన్నతల్లి చేరబిలిచి
చిన్న కథను చెప్పింది

మ ్మ

అమ్మరమ్మని పిలిచింది
కమ్మని కథలు చెప్పింది
బొమ్మలు ఎన్నో ఇచ్చింది
ఆడుకొమ్మని చెప్పింది

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| అన్న | కన్ను | బొమ్మ | కొమ్ము |
| సన్నాయి | జున్ను | కుమ్మరి | బొమ్మూరు |
| ఉన్ని | వెన్నెల | అమ్మాయి | తుమ్మెద |
| పన్నీరు | గన్నేరు | జమ్మి | దొమ్మేరు |

వెన్నదొంగ

పున్నమి వెన్నెల

జమ్మి కొమ్మ

తుమ్మెద ఝుంకారం



ABP 2008-09

కింది ఖాళీలను నింపాలి.

1. పు .......... మి
2. వె .......... దొంగ
3. జొ.......... చేను
4. క.......... ని పాట
5. బొ.......... ల కొలువు
6. జ .......... కొమ్మ

కింది అక్షరాలతో పదాలు రాయండి.

అ, నా, వె, సు, చి, జొ — న్న

అ, రె, చె, బొ, కొ, తు — మ్మ

కింది మాటలను జతపరచాలి.

| | |
|---|---|
| మొక్క | కొమ్మ |
| లేత | జొన్న |
| చెమ్మ | బొమ్మ |
| చిన్న | చెక్క |





# 7 ద్విత్వ అక్షరాలు - 'య' ఒత్తు, 'ర' ఒత్తు





య ్య

ఉయ్యాలలో పాపాయికి
కొయ్యబొమ్మ ఇచ్చాడు
కొయ్యగుర్రం ఎక్కి బాబు
అయ్యవంక చూశాడు

ర ్ర

మర్రిచెట్టు నీడలోకి
కర్రిఆవు వచ్చింది
బుర్రమీసం ఉన్నతాత
కర్రపట్టి వచ్చాడు

కింది పదాలు పలకాలి, చదవాలి.

పెయ్య పొయ్యి
రొయ్యలు నెయ్యి
ఉయ్యాల చెయ్యి
ఊడల ఉయ్యాల
ముందు నుయ్యి వెనుక గొయ్యి

బుర్ర కర్ర
తొర్ర గొర్రె
వెర్రి పుర్రె
మర్రి తొర్ర
చిర్రుబుర్రులాడకు

కింది పదాలను జతపరచాలి.

| | |
|---|---|
| మ్రి | దూడ |
| పెయ్య | గుర్రం |
| ఎర్ర | నీడ |
| కొయ్య | రంగు |



చిత్రంచూసి పేర్లు రాయండి.





.........................   .........................





.........................   .........................



# 8 ద్విత్వ అక్షరాలు - 'ల' ఒత్తు, 'వ' ఒత్తు





ల ్ల

చిన్న పల్లెలోన మల్లి
చల్లా పాలు అమ్మింది
చిల్లర పైసలు తీసింది
చెల్లెలి చేతికి ఇచ్చింది

వ ్వ

అవ్వమాట వినరా!
పాల బువ్వ తినరా!
పువ్వులాగ నువ్వు
నవ్వుతూ ఆడరా!

కింది మాటలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| బల్ల | నల్లపిల్లి | గువ్వ | గువ్వల జంట |
| చెల్లాయి | చెల్లిపలక | తువ్వాయి | మువ్వల తువ్వాయి |
| పిల్లి | ఉల్లిపాయ | జువ్వి | జువ్వికొమ్మ |
| ఢిల్లీ | మల్లెపొద | కొవ్వూరు | కొవ్వూరుదారి |
| మల్లె | కొల్లేటికొంగ | దువ్వెన | నల్లదువ్వెన |

మల్లెపూవు తెల్లన
మా కుక్క నల్లన

నవ్వుల పువ్వులు
రవ్వలహారం

కింది ఖాళీలను నింపాలి. పదాలు రాయాలి.

| | |
|---|---|
| 1. మ......... పువ్వు | 4. పు.........ల దండ |
| 2. చె......... పలక | 5. గు.........ల జంట |
| 3. ఉ......... తోట | 6. జు.........కొమ్మ |

జతచేయండి.

దువ్వెన

బల్ల

కొవ్వొత్తి

పిల్లి


ఈ మాటలు పలకాలి.

| | |
|---|---|
| తాతగారు | అత్తగారు |
| కనకం | కన్నం |
| కమల | కమ్మలు |
| కాయం | కయ్యం |
| కల | కల్ల |
| పూవు | పువ్వులు |

అవసరమైనచోట ఒత్తులు రాయాలి.

అత గారు
ఉయా ల
ముక ర
ఎ రరంగు
పనీ రు
మలెపొద
బొమ రిలు
గువ లజంట



# 9 ద్విత్వ అక్షరాలు - 'గ' ఒత్తు, 'చ' ఒత్తు




గ ్గ

లేత బుగ్గల పాపాయి
పూల మొగ్గలు తుంచింది
నల్ల బొగ్గు తీసింది
ముగ్గుమీద గీసింది

చ ్చ

పచ్చపచ్చని పచ్చికమీద,
పిచ్చుక వాలెను ముచ్చటగా
మచ్చిక చేసి పట్టబోవగా
పిచ్చుక ఎగిరెను నిచ్చెనపై

కింది మాటలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| బుగ్గ | పాలబుగ్గ | మచ్చ | మచ్చలఆవు |
| అగ్గి | అగ్గిపుల్ల | మచ్చిక | పచ్చికబయలు |
| దగ్గు | సగ్గుబియ్యం | కుచ్చు | కుచ్చులజడ, |
| ముగ్గు | ముంగిట ముగ్గు | నిచ్చెన | గచ్చునేల |
| సగ్గు బియ్యం పాయసం | | పచ్చిక మీద పిచ్చుక | |
| అగ్గిమీద గుగ్గిలం | | పచ్చపచ్చని చేమంతులు | |

ఖాళీలను కింది అక్షరాలతో నింపాలి, పదాలు రాయాలి.

గ్గ, గ్గి, చ్చి, గ్గు, చ్చె, చ్చ

1. పాల బు.........
2. స......... బియ్యం
3. గు.........ళం
4. ది.........న
5. మ.........క
6. ము.........ట

కింది వాక్యాల నుంచి చిన్న చిన్న పదాలు రాయాలి.

అగ్గిమీద గుగ్గిలం

..............................

..............................

..............................

పచ్చిక మీద పిచ్చుక

..............................

..............................

..............................





# 10 ద్విత్వ అక్షరాలు - 'ట' ఒత్తు, 'డ' ఒత్తు





ట ట

గట్టుమీద పొట్టిచెట్టు
చెట్టుమీద చిట్టిపిట్ట
పిట్టనోట పూరిపుడక
చిట్టిపిట్ట కట్టెగూడు

డ డ

దొడ్డిలోన గడ్డివాము
గడ్డివాము ముందు గొడ్డు
గడ్డమీద గడ్డపార
ఒడ్డుమీద తెడ్డుపడవ

ఈ పదాలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| పుట్ట | పట్టీలు | బిడ్డ | గొడ్డలి |
| పట్టా | మెట్టూరు | గడ్డి | ఒడ్డాణం |
| మట్టి | కట్టెలు | లడ్డు | కడ్డీలు |
| పట్టు | పొట్టేలు | గుడ్డు | వరిగడ్డి |
| కట్టెల మోపు | | గొడ్డు ముందు గడ్డి | |
| చుట్టపు చూపు | | బిడ్డ చేతిలో లడ్డు | |



ABP 2008-09

ఈ అక్షరాలతో మాటలు వ్రాయాలి.

ఋ, గ, న, మ, త, పు

ట్టి
1 ..................
2 ..................
3 ..................
4 ..................

డ్డి
1 ..................
2 ..................
3 ..................
4 ..................

ఈ అక్షరాలతో మాటలు కూర్చండి.

గ, పి, బొ, ట్టు త

ట్ట అ, ర

ఉదా: ........గట్టు........

..................

..................

..................

..................

..................

..................

..................

..................

..................



## 11 ద్విత్వ అక్షరాలు - 'ద' ఒత్తు, 'ప' ఒత్తు





ద ్ద

ముద్దు లొలికే పాపాయి
అద్దాల పరికిణి కట్టింది
అద్దంలోన చూసింది
ఎద్దుల బండి ఎక్కింది

ప ్ప

గొప్పకోసం అప్పులు చేయకు
చప్పున అంటూ ఉప్పును తినకు
ఎప్పటి పనిని అప్పుడె చేయి
ఒప్పుగ గొప్ప పేరును పొందు

ఈ మాటలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| ముద్ద | అద్దాలు | కప్ప | ఉప్పాడ |
| చద్ది | ముద్దులు | దుప్పి | చప్పుడు |
| రద్దీ | మద్దూరు | కప్పీ | ఉప్పెన |
| ఎద్దు | మద్దెల | ఉప్పు | పుప్పొడి |
| ముద్దుల కొడుకు | | ఒప్పుల కుప్ప | |
| మద్దెల మోత | | పప్పు దప్పళం | |

కింది ఖాళీలను నింపాలి.

1. మ......ల 4. ఉ......న

2. ర......  5. పు......డి

3. అ......లు 6. దు......



'ద' ఒత్తు పదాలకు ఎరుపురంగు.

'ప' ఒత్తు పదాలకు ఆకుపచ్చరంగు వేయండి.






# 12 ద్విత్వ అక్షరాలు - 'బ'ఒత్తు, 'స' ఒత్తు





బ ్బ

మబ్బులవాన కురిసింది
అబ్బాయి దబ్బున జారాడు
జుబ్బాకు బురద అంటింది
సబ్బుతో జుబ్బా ఉతికాడు

స ్స

బస్సులో ఊరికి పోయాము
టైరులో గాలి తుస్సంది
కస్సుమంటూ లేచాము
ఉస్సురంటూ బస్సుదిగాం

ఈ మాటలు పలకాలి. చదవాలి.

దెబ్బ రబ్బరు
జుబ్బా అబ్బాయి
సిబ్బి గబ్బిలం
డబ్బు బొబ్బిలి
గొబ్బి పాట
రుబ్బురోలు

లెస్స శిరస్సు
లస్సీ వయస్సు
బస్సు సరస్సు
ధనుస్సు ఉషస్సు
ఇంద్ర ధనుస్సు
ఎర్ర బస్సు

'బ్బు', 'స్సు' చివర వచ్చేటట్లు కింది ఖాళీలలో మాటలు రాయాలి.

| | |
|---|---|
| మ<br>స<br>ఉ | బ్బు |

1. ..............................
2. ..............................
3. ..............................

| | |
|---|---|
| బ<br>శిర<br>ఉప | స్సు |

1. ..............................
2. ..............................
3. ..............................

బొమ్మను చూసి పేర్లు రాయాలి.


--------------------


--------------------


--------------------


--------------------



## 13 ద్విత్వ అక్షరాలు - 'ళ' ఒత్తు, 'జ' ఒత్తు





**ళ** ళ

తలుపుకు తాళం వెయ్యాలి
గుళ్ళో పెళ్ళికి వెళ్ళాలి
పెళ్ళి భోజనం చెయ్యాలి
మళ్ళీ ఇంటికి రావాలి

**జ** జ

బుజ్జిపాప నడిచింది
గజ్జెలు గలగల లాడాయి
తాత మజ్జిగ తాగాడు
సజ్జ చేనుకు వెళ్ళాడు

ఈ మాటలు పలకాలి, చదవాలి.

| | | | |
|---|---|---|---|
| బిళ్ళ | బళ్ళారి | సజ్జ | బెజ్జం |
| పెళ్ళి | గుగ్గిళ్ళు | బొజ్జ | బుజ్జాయి |
| కిళ్ళీ | తాళ్ళూరు | బజ్జీ | మజ్జిగ |
| నీళ్ళు | గొళ్ళెం | గుజ్జు | గజ్జెలు |

చల్లని మంచి నీళ్ళు
పళ్ళెంలో జామపళ్ళు
సూది బెజ్జం
మామిడి గుజ్జు

కింది ఖాళీలను నింపాలి.

1. పె.........కూతురు
2. మంచి నీ.........
3. తలుపు గొ.........ం
4. మ.........గ పులుసు
5. అరటికాయ బ.........లు
6. కాలిగ.........లు

కింది పదాలను జతపరచాలి.

| | |
|---|---|
| తలుపు | భోజనం |
| గుళ్ళో | గజ్జెలు |
| పెళ్ళి | చేను |
| బుజ్జిపాప | తాళం |
| సజ్జ | పెళ్ళి |





# 14 అరుదుగా వచ్చే అక్షరాలు ః, జ్ఞ, ఞ





ః | జ్ఞ ఞ

ఈ మాటలు పలకాలి, చదవాలి.

| | | |
|---|---|---|
| ఉషః కిరణాలు | వాఙ్మయం | యజ్ఞం |
| ప్రాతః కాలం | | ఆజ్ఞ |
| దుఃఖ సమయం | | జ్ఞానం |
| అంతఃపురం | | అజ్ఞానం |
| | | విజ్ఞత |

ఈ కింది చక్రంలోని అక్షరాలతో 'జ్ఞ' చివరన, మధ్య, వచ్చేలా మాటలు రాయాలి.

1. .............................
2. .............................
3. .............................
4. .............................



# 15 సంయుక్త అక్షరాలు

(ఒక హల్లుతో వేరే హల్లు చేరే అక్షరాలు)

ఈ మాటలను విని సరిగా పలకాలి.

| | |
|---|---|
| మర్కటం | పట్నం |
| ఖడ్గం | సర్పం |
| దీర్ఘం | దర్బారు |
| కుర్చీ | నిర్భయం |
| గర్జన | నిర్మలం |
| అష్టమి | అమావాస్య |
| ఇష్టం | చట్రం |
| షష్ఠి | శుక్లపక్షం |
| పౌర్ణమి | ద్వీపం |
| విష్ణువు | ఆదర్శం |
| భక్తి | కర్షకుడు |
| ప్రార్థన | ఉత్సవం |
| చతుర్దశి | అర్హత |

అభ్యాసం:-

ర్క, ర్ణ, గ్రీ, ర్జ

పై అక్షరాలతో కింది ఖాళీలను నింపాలి.

1. మ.........టం 2. పౌ.........మి 3. సు.........వుడు. 4. గ.........న.



కింది మాటలు చదవాలి.

| | |
|---|---|
| ముత్యం | పోస్టుకార్డు |
| అర్థం | సప్తస్వరాలు |
| పద్యం | పూర్వాభాద్ర |
| దీర్ఘం | కృష్ణానది |
| చైత్రం | సంవత్సరం |
| ముఖ్యం | ఝాన్సీరాణి |
| ధనిష్ఠ | శుక్రవారం |
| మూర్ఖుడు | పర్వతం |

ఈ మాటలను చదవాలి. రాయాలి.

| | |
|---|---|
| పూర్ణం | నక్షత్రాలు |
| ప్రాణం | వార్తాపత్రిక |
| ద్రోణుడు | ఉపాధ్యాయుడు |
| అధ్యక్షుడు | గరుత్మంతుడు |

కింది పదాలను మొదటి అక్షరాన్ని బట్టి అక్షరక్రమంలో రాయాలి.

ముత్యం, అర్థం, పద్యం, గద్యం

............ ......... ......... .........

## 16 హల్లులు - ఒత్తులు

| | |
|---|---|
| క - ్క | ద - ్ద |
| ఖ - ్ఖ | ధ - ్ధ |
| గ - ్గ | న - ్న |
| ఘ - ్ఘ | ప - ్ప |
| చ - ్చ | ఫ - ్ఫ |
| ఛ - ్ఛ | బ - ్బ |
| జ - ్జ | భ - ్భ |
| ఝ - ్ఝ | మ - ్మ |
| ఞ - ్ఞ | య - ్య |
| ట - ్ట | ర - ్ర |
| ఠ - ్ఠ | ల - ్ల |
| డ - ్డ | ళ - ్ళ |
| ఢ - ్ఢ | వ - ్వ |
| ణ - ్ణ | శ - ్శ |
| త - ్త | ష - ్ష |
| థ - ్థ | స - ్స |
| | హ - ్హ |

అభ్యాసం : అక్షరాలకు సరియైన ఒత్తులను జతపరచి రాయాలి

గ.............................. ్ఠ

చ.............................. ్గ

ఠ.............................. ్జ

జ.............................. ్చ

బొమ్మను చూసి పదం రాయాలి.



..............................

..............................





## 17 సంశ్లేషఅక్షరాలు:

ఒక హల్లుకు - రెండు ఒత్తులు చేరిన అక్షరాలతో మాటలు

కింది మాటలు పలకాలి, చూసి రాయాలి.

స్త్రీ

జ్యోత్స్న

పార్శ్వం

వస్త్రం

రాష్ట్రం

ధృతరాష్ట్రుడు

సామర్థ్యం

పై మాటలను చూసి కింది ఖాళీలను నింపాలి.

1. పా........ ........
2. వ ........ ........
3. రా ........ ........
4. సామ ........ ం

# 18 కౌరవులు - పాండవులు



హస్తినాపురానికి రాజు ధృతరాష్ట్రుడు. అతనికి నూరుగురు కొడుకులు. వారిని కౌరవులు అంటారు. వారిలో పెద్దవాడు దుర్యోధనుడు.

పాండురాజు ధృతరాష్ట్రుని తమ్ముడు. పాండురాజుకు ఐదుగురు కొడుకులు. వారిని పాండవులు అంటారు. వారిలో పెద్దవాడు ధర్మరాజు. మధ్యవాడు అర్జునుడు.

కౌరవులు, పాండవులు ద్రోణాచార్యుని దగ్గర విద్యను అభ్యసించారు. వీరికి గురుభక్తి ఎక్కువ.

కింది మాటలను పలకాలి, సంయుక్తాక్షరాలను గుర్తుపట్టి రాయాలి.

| | |
|---|---|
| హస్తినాపురం | ద్రోణాచార్యులు |
| ధృతరాష్ట్రుడు | ధర్మరాజు |
| దుర్యోధనుడు | అర్జునుడు |



కింది మాటలు చదవాలి. మొదటి వరుసలో ఉన్నమాటకు రెండు, మూడు వరుసలలో ఉన్న మాటకు తేడా గమనించాలి.

అనడం........... అంటారు ..................... అన్నారు ఇదే మాదిరిగా కింది మొదటి వరుసలో ఉన్న మాటలు రెండు మూడు వరుసలలో ఎలావుండాలో రాయాలి.

తినడం ..................... .....................

వినడం ..................... .....................

కొనడం ..................... .....................

జతచేయండి.

| | |
|---|---|
| ధృతరాష్ట్రుడు | మధ్యవాడు |
| అర్జునుడు | ధృతరాష్ట్రుని తమ్ముడు |
| ద్రోణుడు | రాజు |
| పాండురాజు | గురువు |



## 19 మా బడి (గేయం)



ఇదే ఇదే మా బడి
ఇదే ఇదే మా చదువుల గుడి

వడిగా బడికి పోతాము
గురువుకు దణ్ణం పెడతాము
ఆటలు పాటలు నేర్చుకొని
ఆనందంగా ఉంటాము

కథలను ఎన్నో వింటాము
కలసికట్టుగా ఉంటాము
విషయాలెన్నో తెలుసుకొని
తెలివిగ మేము ఉంటాము

గురువుల దీవెనలందుకొని
చక్కగ చదువులు చదువుకొని
చక్కని నడవడి నేర్చుకొని
బుద్ధిగ మేము ఉంటాము

సూచన:- పై గేయంలో 'వడిగా' అనే మాట వచ్చింది. ఇక్కడ 'వడి' అనే మాటకు 'గా' చేరింది. అలాగే మరికొన్ని మాటలకు 'గా' చేరుతుంది.
**ఉదా:-** కలసికట్టుగా, సంతోషంగా ఇలాంటివి మీకు తెలిసినవి కొన్ని చెప్పండి.



## 20 రింగురింగు బిళ్ళ (పాట)



రింగు రింగు బిళ్ళ - రూపాయి దండ
దండ కాదురా! - తామర మొగ్గ
మొగ్గ కాదురా! - మోదుగ నీడ
నీడ కాదురా! - నిమ్మల బావి
బావి కాదురా! - బచ్చలకూర
కూర కాదురా! - కుమ్మరి మెట్టు
మెట్టు కాదురా! - మేదర సిబ్బి
సిబ్బి కాదురా! - చీపురుకట్ట
కట్ట కాదురా! - కావడి బద్ద
బద్ద కాదురా! - బారెడు మీసం
మీసం కాదురా! - మిరియాల పొడుం
పొడుం కాదురా! - పోతురాజు

ఈ మాటలు పలకాలి, రాయాలి.

బిళ్ళ - మొగ్గ - బచ్చలి - మెట్టు - సిబ్బి - కట్ట
కుమ్మరి - బద్ద - మిరియం - మేదరి - పొడుం

సూచన :- ఈ పాటలో ఇద్దరు విద్యార్థులు ప్రతి పంక్తిలో మొదటి సగం ఒకరు, రెండో సగం ఒకరు పాడాలి.

## 21 ప్రాసవాక్యాలు

మంచిమాట ముద్దు
కల్లలాడవద్దు

కలసిమెలసి మెలుగు
కలిమి బలిమి కలుగు

కీడు చేయ ముప్పు
వాదులాడ తప్పు

పొల్లుమాట విడువు
గట్టిమాట నుడువు

కట్టులేని నోరు
గట్టు తెగిన ఏరు

మాటతప్పబోకు
మంచి విడువబోకు

పెద్దవారి మాట
పెరుగన్నం మూట

అడుసు తొక్కుటేల ?
కాలు కడుగు టేల ?



1. పై ప్రాస వాక్యాలను చదవాలి, చెప్పాలి.
2. పై ప్రాస వాక్యాల్లో రెండు చిన్న మాటలు కలిసి ఒకే మాటగా అయిన వాటిని గుర్తు పట్టి చెప్పాలి.



## 22 దిక్కులు - మూలలు



రఘు నిద్రలేచేసరికి వెలుగు కనబడింది. అతను వెలుగు వస్తున్న వైపు వెళ్లాడు. ఆ వైపున ఆకాశంలో సూర్యుడు కనబడ్డాడు. సూర్యుడు పైకి వస్తున్న కొద్దీ వెలుగు పెరిగింది. రోజూ సూర్యుడు, ఆ వైపునే ఉదయిస్తాడు.

రఘు వెనకాలే అక్కయ్య వచ్చింది. సూర్యుడు ఉదయించే వైపును 'తూర్పు దిక్కు' అంటారు. అస్తమించే దిక్కును 'పడమర' అంటారు అని చెప్పింది. దిక్కులు, మూలలు ఎలా తెలుసుకోవాలో కూడా చెప్పింది.

ఉదయించే సూర్యునికి ఎదురుగా నిలబడి చేతులు చాపితే ఎడమవైపు ఉన్నది ఉత్తర దిక్కు. కుడి చేతి వైపు ఉన్నది దక్షిణ దిక్కు.

రెండు దిక్కులు కలిసే చోటును 'మూల' అంటారు. తూర్పు దక్షిణాల మధ్య ఉన్నది 'ఆగ్నేయ' మూల. దక్షిణానికీ, పడమరకూ మధ్య ఉన్నది 'నైరుతి' మూల. పడమరకూ, ఉత్తరానికీ మధ్య వున్నది 'వాయవ్య' మూల. ఉత్తరానికీ, తూర్పు దిక్కుకూ మధ్య ఉన్నది 'ఈశాన్య' మూల.

ఇద్దరూ ముంగిట్లోనుంచి పడమర దిక్కుగా తిరిగి ఇంట్లోకి వచ్చారు.






కింది (అ) లో ఉన్న మాటలతో ఒక వాక్యం (ఆ) లో ఉన్న మాటలతో ఒక వాక్యం రాయాలి.

| (అ) | (ఆ) |
|---|---|
| రఘు | దిక్కుల |
| అక్కయ్య | అంటారు |
| వచ్చింది | మూల |
| వెనకాలే | చోటును |
| | కలిసే |
| | రెండు |

కింది వాక్యాల్లో ఖాళీలు నింపాలి.

1. మా బడి మా ఇంటికి ...................... దిక్కున ఉంది
2. సూర్యుడు ఉదయించే దిక్కు ..................
3. సూర్యుడు అస్తమించే దిక్కు .....................
4. పడమర దిక్కుకూ ఉత్తర దిక్కుకూ మధ్య ఉన్న మూల ..................

## 23 సూర్యుడు - చంద్రుడు



పొద్దున, సాయంత్రం సూర్యుడు పెద్దగా అందంగా కనిపిస్తాడు. సూర్యుడు మధ్యాహ్నం నడినెత్తి మీదికి వస్తాడు. అప్పుడు ఎండ మండి పోతుంది.



సూర్యుడు మనకు వెలుతురునూ, వేడినీ ఇస్తాడు. సూర్యుడు లేకపోతే ప్రపంచమంతా చీకటిగా ఉంటుంది. మనుషులు, జంతువులు, పక్షులు, చెట్లు అన్నీ సూర్యుని వెలుతురు వల్లా, వేడి వల్లా బతుకు తున్నాయి.





సూర్యుని కిరణాలు సముద్రాల మీద నదులమీద, చెరువుల మీద పడతాయి. ఆ కిరణాలవేడికి నీరు ఆవిరిగా మారుతుంది. నీటి ఆవిరి పైకి పోతుంది. మేఘాలుగా తయారవుతుంది. మేఘాలు చల్లబడినప్పుడు వర్షం కురుస్తుంది. వర్షం వల్ల పంటలు పండుతాయి. పంటల వల్ల మనకు ఆహారం లభిస్తుంది. మనం సుఖంగా, సంతోషంగా ఉంటాం.





సూర్యుడు అస్తమించగానే చీకటి పడుతుంది. రాత్రి పూట ఆకాశంలో చంద్రుడు కనబడతాడు. చుక్కలు కూడా కనబడతాయి. చుక్కల్లో చంద్రుడు రాజులా ఉంటాడు. అందుకే చంద్రుణ్ణి 'రేరాజు' అంటారు. రాత్రి పూట చంద్రుడి నుంచి వచ్చే వెలుతురును 'వెన్నెల' అంటాం. వెన్నెల చల్లగా ఉంటుంది.



అమ్మ చందమామను చూపిస్తుంది. పాటపాడుతూ పాపకు అన్నం పెడుతుంది. వెన్నెలలో అమ్మమ్మ కథలు చెబుతుంది. పున్నమి నాటి రాత్రి చంద్రుడు నిండుగా, గుండ్రంగా ఉంటాడు. పున్నమి వెన్నెలను 'పండువెన్నెల' అంటాం.

**కొత్తమాటలు - (అర్థాలు)**

| | | |
|---|---|---|
| మేఘాలు | = | మబ్బులు |
| వర్షం | = | వాన |
| ఉదయించడం | = | పుట్టడం |
| అస్తమించడం | = | కుంకడం |

వ్యతిరేక పదాలు

| | | |
|---|---|---|
| వెలుగు | x | చీకటి |
| రాత్రి | x | పగలు |
| సుఖం | x | దుఃఖం |
| ఉదయించడం | x | అస్తమించడం |



ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలి.

1. సూర్యుడు మనకు ఏమి ఇస్తాడు?
2. మేఘాలు ఎలా తయారవుతాయి?
3. వర్షం ఎలా కురుస్తుంది?
4. పున్నమినాటి చంద్రుడు ఎలా ఉంటాడు?

కింది ఖాళీలను నింపాలి.

1. సూర్యుడు మధ్యాహ్నం .............. మీదికి వస్తాడు.
2. పున్నమి వెన్నెలను .............. అంటారు.
3. వర్షం వల్ల .............. పండుతాయి.
4. చంద్రుణ్ణి ........... అంటారు.

సూచన: చందమామను గురించిన పాటలు పాడించాలి.



## 24 బుజ్జిమేక (పాట)



బుజ్జి మేక బుజ్జిమేక ఏడకెళ్ళితివి?
రాజుగారి దొడ్డిలోన మేతకెళ్ళితిని
రాజుగారి దొడ్డిలోన ఏమి చూస్తివి?
రాణిగారి పూలచెట్ల సొగసు చూస్తిని



పూలచెట్లు చూసి నీవు ఊరుకుంటివా ?
ఊరుకొనక పూలచెట్లు మేసి వస్తిని
మేసి వస్తే నిన్ను భటులు ఏమి చేసిరి ?
భటులు నన్ను కొట్టవస్తే తుర్రు మంటిని

కింది ఖాళీలను నింపాలి.

1. బుజ్జిమేక ....................... గారి దొడ్డిలోకి వెళ్ళింది.
2. రాణిగారి పూలచెట్ల ................చూసింది.
3. భటులు నన్ను కొట్టవస్తే ..................... మంటిని.

పై పాటలోని ద్విత్వాక్షరాలతో కూడిన మాటలు రాయాలి.

- పై పాట పాడుతూ పిల్లలు జట్లలో అభినయం చేయాలి.

## 25 తెలుగు నెలలు

| | |
|---|---|
| చైత్రం | ఆశ్వయుజం |
| వైశాఖం | కార్తీకం |
| జ్యేష్ఠం | మార్గశిరం |
| ఆషాఢం | పుష్యం |
| శ్రావణం | మాఘం |
| భాద్రపదం | ఫాల్గుణం |

### తిథులు

నెలకు రెండు పక్షాలు. వీటిలో ఒకటి శుక్లపక్షం, రెండోది కృష్ణపక్షం.

పదిహేను దినాలను ఒక పక్షం అంటారు. పక్షంలో పదిహేను తిథులు ఉంటాయి. శుక్లపక్షంలో చంద్రుడు రోజురోజుకూ పెరుగుతూ ఉంటాడు. కృష్ణపక్షంలో రోజురోజుకూ తరుగుతూ ఉంటాడు.



| శుక్ల పక్షం | తిథి | కృష్ణపక్షం |
|---|---|---|
| | 1. పాడ్యమి | |
| | 2. విదియ | |
| | 3. తదియ | |
| | 4. చవితి | |
| | 5. పంచమి | |
| | 6. షష్ఠి | |
| | 7. సప్తమి | |
| | 8. అష్టమి | |
| | 9. నవమి | |
| | 10. దశమి | |
| | 11. ఏకాదశి | |
| | 12. ద్వాదశి | |
| | 13. త్రయోదశి | |
| | 14. చతుర్దశి | |
| | 15. పౌర్ణమి / 15. అమావాస్య | |

## 26 మా ఇల్లు



నా పేరు రమ. నేను రెండవ తరగతి చదువుతున్నాను. మా ఇల్లు చాలా అందంగా ఉంటుంది. మా ఇంట్లో మా అమ్మ నాన్న, నేను తమ్ముడు ఉంటాం. మా అమ్మా నాన్న మమ్మల్ని ఎంతో ముద్దుగా చూసుకుంటారు. మా నాన్న బొమ్మలు ఇస్తారు. మేము వాటితో ఆడుకుంటాం. అమ్మ మిఠాయిలు పెడుతుంది. వాటిని ఇంట్లో అందరం తింటాం.

మా ఇంటి వెనక పెరడు ఉంది. అందులో రకరకాల పూలమొక్కలు ఉన్నాయి. అవి రోజా పూలు పూస్తాయి. కొబ్బరి చెట్లు, జామ చెట్లూ కూడా ఉన్నాయి. కొబ్బరి బోండాలు, జామ పండ్లు అంటే మాకెంతో ఇష్టం.

మా ఇంటి పెరట్లో ఒక బావి ఉంది. మేము రోజూ ఆ బావిలోని నీళ్ళు తోడి పూలమొక్కలకూ, చెట్లకూ పోస్తాం. కూరగాయల మొక్కలు కూడా పెరట్లో పెంచుతాం. బెండకాయలు, టమాటాలు, వంకాయలు, దిక్కుడు కాయలు బాగా కాస్తాయి. తోటకూర, గోంగూర, మెంతికూర కూడా పెరట్లో పెరుగుతాయి.



మా ఇంటి ముందు పెద్ద వేప చెట్టు ఉంది. మేము దాని నీడలో ఆడుకుంటాం. అందుకే మా ఇల్లంటే మాకెంతో ఇష్టం.



అభ్యాసాలు :-

కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలి.

1. ఇంట్లో ఎవరెవరు ఉంటారు?
2. పెరట్లో ఏ చెట్లు ఉన్నాయి?
3. పెరట్లో పెంచే కొన్ని మొక్కల పేర్లు చెప్పండి?
4. మీకు తెలిసిన కొన్ని కూరగాయల పేర్లు చెప్పండి?

కింది మాటలు సరిచేసి వాక్యాలు రాయాలి.

1. ఇల్లు - చాలా - ఉంటుంది. - మా - అందంగా
2. అంటే - ఇష్టం. - మాకెంతో - జామపండ్లు
3. పూస్తాయి. - రోజా - పూలమొక్కలకు - పూలు

- మీ ఇంట్లో వాళ్ళ పేర్లు రాయాలి.
- మీ ఇంటిని గురించి 4,5 వాక్యాలు చెప్పాలి, రాయాలి.
- ఇంటి బొమ్మ గీయాలి.

## 27 ఉపకారం (గేయకథ)



అనగనగా అడవిలోన
అందమైన చెట్లనడుమ
కాకమ్మ పిచ్చుకమ్మ
కలసిమెలసి ఉండసాగె
ఒక్కరోజు గాలివాన
హోరురాగ పిచ్చుకమ్మ
కట్టెగూడు కూలిపోయె
కుమిలికుమిలి ఏడ్చె తాను
పిచ్చుకమ్మ ఎగిరిపోయి
పిల్లాపాపలతోడను
కాకమ్మ గూడు చేరె
వలదు వలదు పొమ్మంటూ
తరిమికొట్టె కాకమ్మ

జడివానలు కురవంగా
తుఫాను గాలి వీచంగా
కాకమ్మ కట్టెగూడు
కూలిపోయె, కుమిలి ఏడ్చె
పిల్లాపాపలతోడను
పిచ్చుకమ్మ గూడుచేర
కష్టకాల మందు తనను
కాచని నేస్తాన్ని చూసి
అపకారికి ఉపకారమె
గొప్పమేలు అని తలచి
కాకమ్మను ఇంటిలోకి
పిచ్చుకమ్మ పిలుచుకుంది
ఆపదలో ఆదుకుంది.

ప్రశ్నలు :-

1. గాలి వానకు ఎవరి గూడు కూలిపోయింది?
2. కాకమ్మ కట్టెగూడు ఎందుకు కూలిపోయింది?
3. కష్టకాలంలో పిచ్చుకమ్మ కాకిని ఎలా ఆదుకుంది?

సూచన:- ఈ కథను సొంత మాటల్లో చెప్పించాలి. కాకి-పిచ్చుక బొమ్మలు గీయించాలి.
- కథలోని కాకమ్మ, పిచ్చుకమ్మలాగా మాట్లాడించాలి.



## 28 మంచి అలవాట్లు



వాణి వేకువనే నిద్ర లేస్తుంది. పళ్ళు శుభ్రంగా తోముకుంటుంది. ప్రతిరోజూ గోరు వెచ్చని నీటితో స్నానం చేస్తుంది. ఉతికిన దుస్తులు ధరిస్తుంది. తల నున్నగా దువ్వు కుంటుంది. గోళ్ళు పెరిగితే కత్తిరించు కుంటుంది. అన్నం తినే ముందు కాళ్ళూ చేతులూ కడుక్కుంటుంది. పరిశుభ్రమైన నీటిని తాగుతుంది. మంచి ఆహారం తింటుంది. ఎప్పుడూ ఆరోగ్యంగా, ఆనందంగా ఉంటుంది. వేళకు బడికి పోతుంది. అందరితో కలసి మెలసి తిరుగుతుంది. బాగా చదువుకుంటుంది. సాయంత్రం వేళల్లో ఆటలు ఆడుకుంటుంది. వేళకు నిద్రపోతుంది. వాణివి అన్నీ మంచి అలవాట్లే.

కింది ప్రశ్నలకు సమాధానాలు చెప్పాలి, రాయాలి.



1. ప్రతిదినం ఎప్పుడు నిద్రలేవాలి?
2. గోళ్ళు పెరిగితే ఏం చెయ్యాలి?
3. ఎలాంటి ఆహారం తీసుకోవాలి?
4. సాయంత్రం వేళల్లో పిల్లలు ఏం చెయ్యాలి?
5. వాణికి ఎలాంటి అలవాట్లు ఉన్నాయి?
6. కొన్ని మంచి అలవాట్లను చెప్పండి?

కింది మాటలు చదివి, రాయాలి.

స్నానం, దువ్వుకొని, నిద్ర, శుభ్రం, ఆరోగ్యం, అలవాట్లు, అన్నం

సూచన:- పొద్దున నిద్రలేచినప్పటి నుంచీ రాత్రి పడుకునే వరకూ విద్యార్థులు ఏఏ పనులు చేస్తారో వారి సొంత మాటల్లో చెప్పాలి.

## 29 చిలకమ్మ పెళ్ళి (పాట)



చిలకమ్మ పెళ్ళి అని - చెలికత్తెలందరూ
చెట్లు సింగారించి - చేరి కూర్చున్నారు
పందిట పిచ్చుకలు - సందడి చేయగ
కాకుల మూకలు - బాకాలూదగ
కప్పలు బెకబెక - డప్పులు కొట్టగ
కొక్కొరోకోయని - కోడికూయగా
ఝుమ్మని తుమ్మెద - తంబుర మీటగ
కుహూకుహూ యని - కోయిల పాడగా
పిల్లతెమ్మెరలు - వేణువూదగా
నెమలి సొగసుగా - నాట్యంచేయగా
సాలీడిచ్చిన చాపు కట్టుకొని
పెళ్లి కుమారుడు బింకము చూపగ
మల్లీమాలతి - మాధవీ లతలు
పెళ్లి కుమారుని - పెండ్లి కూతురిని
దీవిస్తూ తమ పూవులు రాల్చగ
మైనా గోరింక మంత్రము చదివెను
చిలకమ్మ మగడంత -చిరునవ్వు నవ్వుతూ
చిలకమ్మ మెడకట్టె - చింతాకుపుస్తె

కింది ఖాళీలను నింపాలి.

1. .............. తుమ్మెద తంబుర మీటింది.
2. .............. యని కోయిల పాడింది.
3. నెమలి సొగసుగా .............. చేసింది.



## 30 ఆగస్టు 15 (సంభాషణ)



సరళ :- అన్నా ! రేపు జెండావందనం జరుగుతుంది. మమ్మల్ని ఉదయం ఎనిమిది గంటలకే బడికి రమ్మన్నారు.

మురళి :- ఔను, రేపు ఆగస్టు 15 కదా ! మన పాఠశాలలో జెండా ఎగరవేస్తారు. మనకు మిఠాయిలు పంచుతారు.

నాన్న :- మిఠాయిలు పంచిపెడతారు సరే ! కాని ఈ పండుగ ఎందుకు జరుపుకుంటామో చెప్పు.

మురళి :- ఏమో ! నాకు తెలియదు. మీరే చెప్పండి !

నాన్న :- పూర్వం ఇంగ్లీషువాళ్లు మనదేశానికి వచ్చారు. వాళ్లు మన దేశాన్ని సుమారు రెండు వందల సంవత్సరాలు పాలించారు. 1947లో ఆగస్టు పదిహేనో తేదీన వాళ్లు మనదేశాన్ని విడిచి వెళ్ళారు. అది మనకు స్వతంత్రం వచ్చిన రోజు. అందువల్ల మనం పండుగ చేసుకుంటాం.

మురళి :- అంటే 1947వ సంవత్సరం ఆగస్టు 15 రోజున మనకు స్వాతంత్ర్యం వచ్చిందన్న మాట, అందుకే జెండా వందనం చేస్తున్నాం అన్నమాట!

నాన్న :- మనదేశానికి స్వాతంత్ర్యంసులభంగారాలేదు. దాని కోసం ఎంతో మంది నాయకులు ఎన్నో సంవత్సరాలు పోరాటం సాగించారు.

మురళి :- ఎవరెవరు నాన్నా?



నాన్న:- మహాత్మాగాంధీ, చాచా నెహ్రూ, సరోజినీ నాయుడు, పట్టాభి సీతారామయ్య, టంగుటూరి ప్రకాశం పంతులు లాంటి వాళ్ళు ఎందరో ఉన్నారు.

సరళ :- అందుకే ఇది మనకందరికీ గొప్ప పండుగ రోజు.



అభ్యాసం

ప్రశ్నలు :

1. మనదేశాన్ని ఇంగ్లీషువాళ్ళు ఎన్ని సంవత్సరాలు పాలించారు?
2. స్వాతంత్ర్యం కోసం పోరాటంచేసిన నాయకులెవరు?
3. మనకు స్వతంత్రం ఎప్పుడు వచ్చింది?
4. మీ బడిలో ఆగస్టు 15 పండుగ ఎలా జరుపుకుంటారో మీ మాటల్లో చెప్పండి.

కింది పదాలు పలకాలి, రాయాలి.

ఇంగ్లీషువాళ్ళు, స్వతంత్రం, పట్టాభి సీతారామయ్య, మహాత్మాగాంధీ, నెహ్రూ, సంవత్సరం, ప్రకాశం పంతులు

కింది జాతీయ పండుగలను గమనించాలి.

| | | |
|---|---|---|
| ఆగస్టు 15 | : | స్వాతంత్ర్యదినోత్సవం |
| సెప్టెంబర్ 5 | : | ఉపాధ్యాయ దినోత్సవం |
| అక్టోబర్ 2 | : | గాంధీ జయంతి |
| నవంబర్ 14 | : | బాలల దినోత్సవం |
| జనవరి 26 | : | గణతంత్ర దినోత్సవం |

స్వాతంత్ర్యం కోసం పోరాడిన నాయకుల చిత్రాలు / బొమ్మలు సేకరించాలి. వారిని గురించిన పాటలు పాడాలి.

ఉపాధ్యాయులకు సూచనలు:

కొన్ని జెండా వందనం గీతాలు నేర్పాలి. వాటిని లయబద్ధంగా పాడించాలి.

ఆగస్టు 15 సంభాషణను - నాటకీకరణ చేయించాలి.

## 31 పొడుపు కథలు



తెల్లని పొలంలో
నల్లని విత్తనాలు
చేత్తో చల్లుతారు
నోటితో ఏరుతారు



చెయ్యని కుండ
పొయ్యని నీళ్లు
వెయ్యని సున్నం
తియ్యగ ఉండు



చిటారు కొమ్మన
మిఠాయి పొట్లం
పటాలమెప్పుడు
పక్కనే ఉండు



అయ్య అంటే కలవవు
అమ్మ అంటే కలుస్తాయి



ఇంతింత బండి ఇనపకట్ల బండి
తొక్కితే నా బండి తంబై ఆమడలు [illegible]తుంది



పళ్లెంలో పక్షి - ముక్కుకు ముత్యం
తోకతో నీరు తాగుతుంది





ముక్కుమీది కెక్కు - ముందరి చెవులు నొక్కు
టక్కు నిక్కుల సొక్కా - జారిందంటే పుటుక్కు



భూమాతకు ముద్దు బిడ్డ - ఆకాశపు జున్ను గడ్డ
రాత్రివేళ రాచరికం - పగలయితే పేదరికం

**అభ్యాసం వేదిక:**

- పొడుపు కథలను మరికొన్నింటిని సేకరించి, జట్లలో వేయించి సమాధానాలు చెప్పించాలి.

# 32 ఐకమత్యం



ఒక అడవిలో నాలుగు ఎద్దులు ఉండేవి. అవి కలసి మెలసి ఉండేవి. ఒక సారి ఒక సింహం ఒక ఎద్దును చంపబోయింది. వెంటనే నాలుగు ఎద్దులు కలిసి ఒకేసారి సింహాన్ని ఎదిరించాయి. సింహం పారిపోయింది. వాటిని ఐకమత్యమే కాపాడింది.



కొద్దిరోజుల తరవాత, ఎద్దులు తమలో తాము కలహించుకొన్నాయి. అవి విడిపోయాయి. వేరువేరుగా ఉంటూ వచ్చాయి. ఈ విషయాన్ని సింహం పసిగట్టింది.

ఒక రోజు సింహానికి ఆకలి వేసింది. ఒంటరిగా గడ్డి మేస్తున్న ఒక ఎద్దును చంపి తింది. మిగిలిన ఎద్దులు దాన్ని చూశాయి. కాని ఏమీ పట్టనట్టు ఊరుకున్నాయి.





ఇలా ఆ సింహం ఒక్కొక్క ఎద్దునే చంపి తింది. ఎద్దుల మధ్య ఐకమత్యం లేకపోవడం వల్లనే ఇలా జరిగింది. అవి ప్రాణాలు పోగొట్టుకున్నాయి.

**ఐకమత్యమే బలం**

అభ్యాసం :

1. కథలోని బొమ్మలను చూడండి. కథను సొంతమాటల్లో చెప్పండి.
2. ఈ కథవల్ల మీరేమి తెలుసుకొన్నారు ?
3. మీకు తెలిసిన ఇలాంటి కథలను చెప్పండి.
4. కింది కథావాక్యాలను వరుసలో పెట్టండి.

సింహం ఒక ఎద్దును చంపి తింది.
అడవిలో నాలుగు ఎద్దులు ఉండేవి.
నాలుగు ఎద్దులు కలిసి సింహాన్ని ఎదిరించాయి.
ఎద్దులు తమలోతాము పోట్లాడుకున్నాయి.
సింహం మిగిలిన ఎద్దులను చంపి తింది.
ఎద్దులు ఐకమత్యం లేకపోవడంవల్ల చనిపోయాయి.

5. తొడుగులు, ముసుగులు ధరించి ఈ కథను అభినయించాలి.
6. సింహం గురించి ఐదు వాక్యాలు రాయాలి.

## 33 మనకోసం (గేయం)



అందాలొలికే జాబిల్లి
వెన్నెల చిందును మనకోసం



కొమ్మలదాగిన కోయిలలూ
కమ్మగ పాడును మనకోసం



ఝుమ్మని ఎగిరే తేనెటీగలు
తేనెలు కూర్చును మనకోసం



కమ్ముకు వచ్చే కారుమబ్బులు
వానలనిచ్చును మనకోసం





పొంగుతు పారే నదులన్నీ
నీటిని ఇచ్చును మనకోసం



పచ్చపచ్చనీ తరులన్నీ
ఫలాలు ఇచ్చును మనకోసం

అందుకే పరులకు సాయం చేసి,
పరోపకారిగ నిలవాలి

**అభ్యాసం :**

1. ఈ గీతాన్ని రాగంతో పాడండి.
2. జాబిల్లి మనకోసం ఏం చేస్తుంది?
3. చెట్లుమనకు ఏమి ఇస్తాయి ?
4. కొన్ని పండ్ల బొమ్మలను వేయండి. వాటి పేర్లు రాయండి.
5. పరిసరాలనుంచి మనం ఉపయోగించుకొనే కొన్ని వస్తువుల పేర్లు రాయాలి.



ABP 2008-09

# 34 సాహసం



అది ఒక తండా, ఆ తండాలో అందరూ పొలంపనులు చేసుకుంటారు. అది వేసవి కాలం. ఒక రోజు ఎప్పటిలాగ అందరూ పొలాలకు వెళ్ళారు. వడగాలులు బాగా వీస్తున్నాయి. ఎక్కడో నిప్పురవ్వ మండింది. అంతే. తండాలోని గుడిసెలు అంటుకున్నాయి. గుడిసెల్లో మిగిలిన వారంతా భయంతో బయటకు వచ్చారు.

లచ్చిమి గుడిసెముందు తొక్కుడు బిళ్ళ ఆడుకుంటూ ఉంది. మంటలకు వారి గుడిసె కూడా అంటుకుంది. లచ్చిమి మంటలు చూసి భయపడింది. ఉయ్యాల్లో ఉన్న తమ్ముడు సోమ్లా గుర్తుకు వచ్చాడు. గుడిసెలోకి పరుగెత్తబోయింది. లచ్చిమిని లోపలికి వెళ్ళవద్దని అక్కడ ఉన్న జనం అన్నారు. కాని లచ్చిమి వినలేదు. గుడిసె ఒక వైపు



కాలి కూలింది. లచ్చిమి భయపడకుండా లోపలికి వెళ్ళింది. సోమ్లాను ఎత్తుకొని బయటికి వచ్చింది. ఆ పరుగులో లచ్చిమి పరికిణీకి నిప్పు అంటుకుంది. అక్కడి జనం పరికిణీకి అంటుకున్న మంటను ఆర్పేశారు. ప్రాణాలకు తెగించి లచ్చిమి సోమ్లాను కాపాడింది. ఇంకాస్త ఆలస్యమైతే సోమ్లా మంటల్లో చిక్కుకు పోయేవాడు. లచ్చిమి సాహసాన్ని అందరూ మెచ్చుకున్నారు.



అభ్యాసం :

ఈ కింది వాక్యాలను వరుస క్రమంలో పెట్టాలి.

లచ్చిమి భయపడకుండా లోపలికి వెళ్ళింది.
తండాలోని గుడిసెలు అంటుకున్నాయి.
ప్రాణాలకు తెగించి సోమ్లాను కాపాడింది.
లచ్చిమికి గుడిసెలో ఉయ్యాల్లో ఉన్న తన తమ్ముడు సోమ్లా గుర్తుకు వచ్చాడు.

కింది ఖాళీలను నింపాలి.

1. లచ్చిమి తమ్ముడు ...............
2. లచ్చిమి ................ అందరూ మెచ్చుకున్నారు.

మీ స్నేహితుల పేర్లు రాయాలి.

## 35 గలగలమాటలు



గలగల గలగల సవ్వడితో
కిలకిల కిలకిల నవ్వులతో
బిరబిర బిరబిర నడిచాము
గబగబ గబగబ పోయాము
డమడమ డమడమ డమరువు మోగెను
సుడివడి వడివడి గాలులు వీచెను
పెళపెళ పెళపెళ ఉరుములు ఉరిమెను
తళతళ తళతళ మెరుపులు మెరిసెను
చిటపట చిటపట చినుకులు కురిసెను
జలజల జలజల ఏరులు పారెను
గుమగుమ గుమగుమ పూవులు విరిసెను
వడివడి వడివడి పూలు కోసుకొని
చకచక చకచక మాలలు కట్టీ
బిలబిల బిలబిల గుడికి చేరుకొని
దేవుని మెడలో దండలు వేసి
దీవెనలిమ్మని మొక్కితిమి

అభ్యాసం :
గేయంలోని జంటమాటలు పలకాలి, రాయాలి.
ఉదా - గలగల, కిలకిల మొ॥



## 36 కలసి-మెలసి (చిత్రకథ)



అభ్యాసం :

- చిత్రాలను చూసి కథ చెప్పాలి.
- కథాగేయాన్ని పాడాలి.
  "అనగనగా ......చెప్పెను" (ఈ గేయంను ఉపాధ్యాయుడు పాడించాలి.)
- తొడుగులు, ముసుగులు ధరించి కథను అభినయించాలి.

కిందిచిత్రాలు చూసి పక్షుల పేర్లు, జంతువుల పేర్లు విడిగా రాయాలి.





# 37 రాష్ట్ర చిహ్నాలు




అభ్యాసం:

- "మా తెలుగు తల్లికి మల్లెపూదండ............" గీతాన్ని పిల్లలచేత కంఠస్థం చేయించి పాడించాలి.
- రాష్ట్రచిహ్నాలను సేకరింపజేయాలి. వాటిని తరగతి గదిలో ప్రదర్శింపజేయాలి.

## 38 జాతీయ చిహ్నాలు




అభ్యాసం :

- జాతీయజెండా, జాతీయ పుష్పం చిత్రాలు గీయాలి.
- నెమలిని గురించి, పులిని గురించి మాట్లాడించాలి; అభినయింపజేయాలి.
- జాతీయగీతం పాడాలి.



## 39 సుభాషిత రత్నాలు

(కంఠస్థం చేయవలసినవి)

1. బలవంతుడ నాకేమని
పలువురతో నిగ్రహించి పలుకుట మేలా!
బలవంతమైన సర్పం
చలిచీమల చేత జిక్కి చావదెసుమతీ!

2. అక్కరకురాని చుట్టము
మ్రొక్కిన వరమీని వేల్పు, మోహరమున తా
నెక్కిన పారని గుర్రము
గ్రక్కున విడువంగ వలయు గదరా, సుమతీ!



3. ఎప్పుడు సంపద గలిగిన
అప్పుడు బంధువులు వత్తు రది ఎట్లన్నన్
తెప్పలుగ చెరువు నిండిన
కప్పలు పదివేలు చేరు గదరా సుమతీ!

4. వినదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపదగున్,
కని కల్ల నిజము తెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ!



ABP 2008-09

5. నీళ్ళలోన మొసలి నిగిడి ఏనుగుపట్టు
బయట కుక్క చేత భంగపడును,
స్థానబలిమి గాని తన బలిమి కాదయా;
విశ్వదాభిరామ. వినుర వేమ!

6. అనగఅనగ రాగ మతిశయిల్లుచునుండు
తినగతినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన;
విశ్వదాభిరామ. వినురవేమ.

7. వీడు పరులవాడు వాడు నా వాడని
అల్పబుద్ధి తలచు ఆత్మయందు;
సాధుపుంగవులకు జగమే కుటుంబము
లలిత సుగుణ జాల! తెలుగుబాల!

8. అక్షరంబు వలయు కుక్షి జీవనులకు
నక్షరంబు జిహ్వ కిక్షురసము
అక్షరంబు తన్ను రక్షించు గావున
నక్షరంబు లోక రక్షితంబు.





## అకారాది పదపట్టిక

అ

అక్క
అక్కడ
అక్కర
అక్షరం
అగ్గి
అజ్ఞానం
అడవి
అడుసు
అత్తరు
అతిథి
అతిశయం
అధ్యక్షుడు
అద్దం
అపకారం

అభినయం
అభ్యసించడం
అమ్మడం
అమావాస్య
అర్థం
అర్హత
అలవాటు
అల్పబుద్ధి
అవమానం
అస్తమించడం
అష్టమి
అహింస

ఆ

ఆకర్షణ
ఆకాశం
ఆగ్నేయం
ఆజ్ఞ
ఆదర్శం
ఆదుకోవడం
ఆనందం
ఆపద
ఆమడ
ఆరోగ్యం
ఆలస్యం
ఆవిరి
ఆశ్వయుజం
ఆషాఢం

ఇ

ఇంగ్లీషు
ఇంద్రధనుస్సు

ఇంపు
ఇల్లు
ఇష్టం

ఈ

ఈశాన్యం

ఉ

ఉత్తరం
ఉత్సవం
ఉదయం
ఉదయించడం
ఉన్ని
ఉపకారం
ఉపాధ్యాయుడు

ఉప్పు
ఉప్పెన
ఉయ్యాల
ఉపఃకిరణాలు
ఉషస్సు

ఊ

ఊరు
ఊహ

ఎ

ఎక్కువ
ఎడమ
ఎత్తు
ఎద్దు
ఎర్ర రంగు

ఏ

ఏకాదశి
ఏరడం
ఏరు

ఐ

ఐకమత్యం

ఒ

ఒడ్డాణం
ఒడ్డు
ఒప్పు
ఒప్పుగా

అం

అంతఃపురం
అందం

క

కమఠం
కంఠహారం
కడ్డీలు
కత్తి
కత్తెర
కన్నతల్లి
కర్షకుడు
క్రిఆవు
క్రరు
కలసికట్టు
కలసిమెలసి
కల్ల
కలహం
కార్తీకం
కావడి
కిరణాలు
కిలకిల
కుచ్చులు
కుటుంబం
కుమ్మరి
కృష్ణజింక
కృష్ణపక్షం
కృష్ణానది.

కృషి
కొనియాడు
కొమ్ము
కొయ్యబొమ్మ
కొయ్యగుర్రం
కొలువు
కొల్లేటి కొంగ
కోరుకోవడం
కౌరవులు

ఖ

ఖగం
ఖడ్గం

గ

గబగబ
గచ్చు
గజ్జెలు
గట్టు
గడ్డపార
గడ్డివాము
గబ్బిలం
గర్జన
గరుత్మంతుడు
గద్యం
గలగల

గాలివాన
గిత్త
గీతం
గుజ్జు
గుత్తులు
గుమగుమ
గురువు
గురుభక్తి
గువ్వలజంట
గొయ్యి

ఘ

ఘనులు
ఘనశక్తి
ఘీంకారం

ఞ

జ్ఞానం

చ

చట్రం
చతుర్దశి
చల్లబడడం
చల్ల
చవితి
చిక్కని
చిటచిట
చిర్రుబుర్రు

చిరునవ్వు
చీపురుకట్ట
చుక్కలు
చుట్టం
చెక్కముక్క
చెమ్మచెక్క
చెరువు
చెత్తబుట్ట
చైత్రం
చేను
చౌకబేరం

జ

జరజర
జడివాన
జలజల
జమ్మికొమ్మ
జుబ్బా
జున్ను
జున్నుగడ్డ
జెండా
జేజేలు
జ్యేష్ఠం
జ్యోత్స్న

ఝ

ఝషం
ఝుంకారం

ట

టక్కరి
టైరు

డ

డబడబ
డబ్బు
డప్పు
డమరువు

ఢ

ఢంకా

త

తండా
తదియ
తంబుర
త్రయోదశి
తరగడం
తరిమికొట్టడం
తరులు
తళతళ
తామర
తుఫాను
తుమ్మెద
తువ్వాయి

తూర్పు
తెమ్మెర
తొడుగు
తొ్ర

## ద

దర్బారు
దప్పళం
దప్పి
దశమి
దక్షిణం
ద్వాదశి
దిక్కులు
దీర్ఘం
దీవెన
ద్వీపం
దుప్పి
దువ్వెన
దుస్తులు
దేవత
దేశం

## ధ

ధనిష్ట
ధనుస్సు
ధీరుడు
ధూళి

## న

నక్కినక్కి
నడవడి
నడినెత్తి
నవమి
నక్షత్రాలు
నాయకులు
నిర్భయం
నిర్మలం
నువ్వుపువ్వు
నుయ్యి
నెమలి
నెయ్యి
నేస్తం
నైరుతి

## ప

పట్టా
పడమర
పంచమి
పచ్చిక
పట్నం
పటాలం
పండగ
పత్తి
పద్యం
పందిరి
పన్నీరు
పర్వతం
పసికట్టడం
పల్లె
పక్షం
పక్షులు
ప్రార్థన
పాఠశాల
పాండవులు
పాడ్యమి
పార్శ్వం
పాలపిట్ట
పాలించుట
పిచ్చుక
పింఛం
పున్నమి
పుప్పొడి
పుర్రె
పుష్పం
పుష్యం
పూర్ణం
పూర్ణకుంభం
పెయ్య
పెరగడం
పెరడు
పెళపెళ
పెళ్ళి
పేదరికం
పొదలు
పొదుం
పొట్టేలు
పొయ్యి
పోస్టుకార్డు
పోరాటం
పౌర్ణమి

## ఫ

ఫలం
ఫలితం
ఫాల్గుణం

## బ

బంధువు
బరువు
బాకాలు
బారెడు
బింకం
బిరబిర
బిలబిల
బిరబిగె
బుర్రమీసం
బుజ్జిపాప
బెకబెక
బెజ్జం
బొగ్గు
బొజ్జ
బొమ్మ
బొమ్మరిల్లు

## భ

భక్తి
భటుడు
భయం
భాద్రపదం
భారతం
భారతదేశం
భీముడు
భూమాత
భోజనశాల
భేదం

## మ

మచ్చలు
మచ్చిక
మంత్రం
మధ్యాహ్నం
మద్దెలమోత
మనుజుడు
మబ్బులు
మర్కటం
మల్లెపొద
మాఘం
మార్గశిరం
మిఠాయి
ముక్కెర
ముఖ్యం
ముంగిట
ముగ్గు
ముచ్చట
ముత్యం
ముద్ర
మూలలు
మూర్ఖుడు
మృగం
మృదంగం
మేఘం
మేదరి
మేలు
మొగ్గ
మోత
మోపు

## య

యజ్ఞం
యోచన

## ర

రబ్బరు
రద్దీ
రవ్వలహారం

రాజు
రాచరికం
రాష్ట్రం
రుబ్బురోలు

రెక్క
రేరాజు
రొయ్యలు

## ల

లడ్డు
లస్సీ
లయబద్ధం
లేత

## వ

వడగాలి
వడిగా
వందనం
వయస్సు
వరం
వరిగడ్డి
వర్షం
వస్త్రం
వాఙ్మయం
వాదులాట
వార్తాపత్రిక
వాయవ్యం
విజ్ఞత
విత్తనం
విదియ
విద్య
వెన్నదొంగ
వెన్నెల
వెర్రి
వెలుగు
వెలుతురు
వేకువ
వేణువు
వేళ
వేదపఠనం
వైశాఖం

## శ

శంఖం
శ్రావణం
శిరస్సు
శుక్లపక్షం
శుభ్రం

## ష

షష్ఠి

## స

సగ్గుబియ్యం
సజ్జ
సంతోషం
స్వతంత్రం
సందడి
సన్నాయి
సంపద
సప్తమి
సప్తస్వరాలు
సబ్బు
సముద్రం
సరస్సు
సర్పం
సంవత్సరం
సామర్థ్యం
సాయంత్రం
సాహసం
సింగారం
సిబ్బి
స్త్రీ
సుడివడి
సుత్తి
సూర్యుడు
సొగసు

## హ

హస్తినాపురం
హోరు

# తెలుగు భారతి

రెండవ తరగతి వాచకం



*Published by:* **Arkbird Publications**
#5-9-802, Rosary Convent Lane,
Gunfoundry, Hyderabad - 500 001
**on behalf of A.P. Govt. Text Book Press, Hyderabad.**
**Price Rs. : 12.50**

